# విజ్ఞాపనము.

---:0:---

కొంతకాలము క్రిందట, సహీఫా, జమానా, యను మాసపత్రికలయందు మయూరాసనమును గూర్చి కొంత విరివిగ వ్రాయఁబడిన చారిత్రిక విషయములను జూచి, వాని నొకవ్యాసరూపమున మన యాంధ్రపత్రికలలో నెద్దానియందైనఁ బ్రకటింపఁదలఁచి తీరిక కలిగినప్పుడెల్లను కొంచెముగ వ్రాయుచుఁ గొన్ని దినములకు పూర్తి జేసితిని గాని ప్రాప్తమైన శ్రీమహామిత్రులును, మాకార్యస్థానమున శిరస్తాదారులును నగు మ.రా. బ్రహ్మశ్రీ నృసింహారావుగారు "సశేషముగఁ బత్రికలలోఁ బ్రకటితమగుటకంటె కొంచెము విపులముగనున్న వ్యాసము గాన నొక చిన్నపుస్తకరూపమున నుంచుట యుక్త" మను నభిప్రాయ మిచ్చుటచే నిట్లొనరించితిని. ఇందలి లోపములను క్షమించుటకు భాషావిదులగు పెద్దలు ప్రార్థితులు.

వడ్డపల్లి,
ఆబ్కారి ఆఫీసు.
22-4-12.

ఇట్లు విధేయుఁడు,
కొణకంచి చక్రధరరావు.



# మయూరాసనము



“తఖ్తు” యనునది పారసీభాష యందు కూర్చొనుట కుపయోగింపఁబడు “కుర్చీ” యనుపదమునకు సమానార్థక మగు వాక్యము; గాని యే యేస్వరూపలక్షణములను గలిగి యున్న యాసనము ‘తఖ్తు’ అనుపదమునకు లక్ష్యముగఁ జూడఁబడు చున్నదో యాస్వరూపలక్షణములు ‘కుర్చి’ యని వాడఁబడు నాసనమునకు లే కుండుటచే నిప్పుడు కూర్చుండుభాగ మెటుఁ జూచినను సమానములగు పొడవు వెడల్పులును, నాలుగుకాళ్లును గలిగి దాదాపు ఖట్వారూపమును బోలినదిగ నున్నదానినే ‘తఖ్తు’ అని పిలుచు చున్నారు.

ఇది సర్వసాధారణముగ నందఱుచే వాడఁబడు చున్న “తఖ్తు” అనుపదముయొక్క వివరణము; గాని యీశబ్దముయొక్క ప్రత్యేకార్థము రాచకార్యములను నిర్వర్తించుటకై యొకరాజ్యమును బాలించెడి రాజుచే నధిష్ఠింపఁబడి యుండెడి యాసనముపట్ల వర్తింపు చున్నది. ఈరాజాధిష్ఠిత మగు తఖ్తు యొక్క రూపలక్షణములు గూడ దాదాపుగఁ బైనఁ జెప్పఁబడిన తఖ్తునే పోలి యుండును గాని యిది సామాన్యము లగు తఖ్తులకంటె మిక్కిలి యలంకారయుతముగను బరిమాణమునందు కొంచెము తక్కువగను నుండి యానుకొనుటకు వగు నట్లు వెనుక నొక్క “తకియా” (దిం

డు) యొను పైభాగమున నీడ నిచ్చు చున్నదానిగా నగుపడుచు శిల్పకళా
చాతుర్యయుతమును, మూల్యవంతమునగు నైన మెఱయు చుండెడి యొకఛత్ర
మును గలిగి యుండును.

ఈ తఖ్తు రాజచిహ్నములలో మిక్కిలి యావశ్యక మైనదిగఁ బరిగ
ణింపఁబడు చున్నది దీనికి పీఠారోహణ మను పేరటి మహోత్సవ మొకటి
సంబంధించి యుండును. ఏకార్యానుష్ఠానానంతరము రాజు తానొక స్వాతం
త్ర్యపదవి నంది నిజాధికారమును యథా విధిగ నెరవేర్పశక్తి గలవాఁడగునో
యదియే యీమహోత్సవము పీఠాధిరోహణము ననుసరించి దానికి తుల్య
మగు యావశ్యముగ భావించెడి మఱియొక కర్మ గూడ గలదు. దీనిఁ కిరీట
ధారణోత్సవ మనియును లేక మకుటధారణోత్సవ మనియును జెప్పెదరు
ఈ రెంటికిని బ్రథమము నుండియుఁ బరస్పరసంబంధము గలిగి యుండు
టచే వీనిలో నేపదమును జెప్పినను నాశబ్దమునం దీకార్యములు రెండును గ
మిడి యున్నట్లు సాధారణముగ భావింపఁబడు చుండును గాని యిచ్చట కిరీ
టమును గుఱించివర్ణించుట మా యీ వ్యాసము యొక్క యుద్దేశము గాదు
కావున దానిని గుఱించి యింక నింతకంటె నధికముగ వ్రాయక తఖ్తుయొక్క
యుత్పత్తి కి సంబంధించిన కొన్ని చారిత్రిక విషయములను మాత్రము వివరించి
యాపివేయుట ముఖ్యవిషయమునకు మరలెదము

తఖ్తు యొక్క యారంభము 'జమ్షీదు' అను రాజునుండి పుట్టిన
దనియును, నతని కిదియేగాక మఱికొన్ని నూతననిర్మాణములును గావించ నగా
రవముకూడా కల దనియును, నాతఁడు తన తఖ్తును వివిధములును బహుమూ
ల్యవంతములును నగు రత్నసంచయముల చే మిగుల సుందరముగ నలంకరిం
చి జ్యోతిష్కుల యభిప్రాయముతో నొక శుభలగ్న మేర్పాటు గావించు
కొని యాసమయమునం దాగద్దియ నధిష్ఠించె ననియును, మఱియు నామ
హాత్పంతోవసూచకముగ నొక గొప్పయుత్సవ మొనరించె ననియును

"మూజుసుల్తానీ" యనుచారిత్రమునందు వ్రాయఁబడియున్నది. కాలవిపర్యయమునుదానివెఁ బారశీకరాజ్యపీఠము జహ్మీదునుండి లాగుకొనఁబడె ననంతరము దానిపయి మఱికొందఱు రాజు లధిష్ఠించి ప్రభుత్వ మొనరించుచున్నపుడు వారు నయితము జహ్మీదు యొక్క యీనూతనరచనను మిక్కిలి గౌరవదృష్టితోఁ జూచిరి. సామాన్యముగ నీప్రపంచమునం దొకానొక బుద్ధిమంతుఁ డేదేని యొకపదార్థజాతము నుత్పత్తి చేసి పోవఁగనే యాతనికి పిమ్మట నాపదార్థమునం దొక కొన్నిమార్పు లగు చుండుట లోకధర్మముగ నున్నది. కావున నిట్లే జహ్మీదుచే నిర్మాణము గావింపఁ బడిన తఖ్తు యందుఁ గూడ "ఫరీదూన్" యను విశాలకీర్తియుతుఁ డగు నొక పారశీకపురాజు కొన్ని యావశ్యకములగు సవరణలు గావించి దానిని మిగుల సౌందర్యయుతముగఁ జేయుటే గాక యష్టకోణాకృతిగఁ గావించి యమూల్యము లగు రత్నములతోడను వెండిబంగారులతోడను బహువిధములఁ జిత్రించి దాదాపుగ నిదియు నొక నూతనకల్పనమే యని భావింపఁ బడఁ దగి నట్లుగ మార్చివైచెను. ఈఫరీదూన్ యొక్క తఖ్తును గుఱించి యనేకు లనేకవిధములఁ బర్ణించి యున్నారు, గాని మేము వాని నన్నిటిని వదలి దాని మూల్యక్రమము నించుమించుగాఁ దెలుసుకొనుటకై యాతఖ్తుచుట్టు వేయిబంగారపుగుండ్లు బంతులవలె వ్రేలాడు చుండె ననియును, వానిలోఁ బ్రతి బంతియు నైదువందల మిష్కాలు లనఁగా రెండువందల తులముల తూనికె కలిగి యుండె ననియును మాత్రము చెప్పినఁ జాలు నని తలంచెదము

ఈ ఫరీదూన్ తఖ్తు యొక్క ప్రతిబింబమును దృష్టిపథమునం దిడుకొని చూచు చున్న మనహృదయముల కొక "ప్రాచీనకాలముననే గాక ప్రస్తుతకాలమునఁ గూడ నిట్టి యతివిచిత్రమును, నమూల్యము నగు తఖ్తుకు సరి బోల్చి చెప్పందగు నట్టి తఖ్తు మఱియొకటి లేకుండ నోపు" నని తోఁచవచ్చును. గాని తోడనే మనవిజ్ఞానభావము దేని ప్రతిబింబనిక [illegible]

నీ ఫరీదూన్ తఖ్తు యందలిగౌరవోద్దేశ మంతయు నిరసనమై "ఇది (మయూరాసనము) "ఫరీదూన్" తఖ్తు కేవిషయముననైనను దీసిపోవం జాల" దని తక్షణమే చెప్ప సాహసించెదమో యట్టి మయూరాసనము యొక్క మనోహారస్వరూపమును మనహృచ్చక్షువుల కెదురుగం దెచ్చి నివేదించుచున్నది. ఈ తఖ్తు తావుస్ (మయూరాసనము) ఏమహామహుని యద్వితీయనిర్మాణ చాతురీగరిమకు భూలోకమందలి యద్భుతరచనలలోని కెల్ల నాయకమణియై నేం బేరొందం బడుచున్న తాజ్ మహల్ ప్రబలసాక్ష్యముగ నున్నదో యట్టి మొగలురాజవంశోత్పన్నుండును, భరతఖండసామ్రాజ్యమునకు సార్వభౌముండును నగు షాహాజహానుచక్రవర్తి చేం జేయింపం బడినది గాన నిది ఫరీదూన్ తఖ్తుకంటెను మించి యున్నదని చెప్పుటకు మనకే యభ్యంతరము నుండం జాలదు. వాస్తవముగ విచారించి చూచినచో షాహాజహాను చక్రవర్తి సారనీకసార్వభౌముల మహదైశ్వర్య మీభరతఖండపట్టభద్రుని మహాభాగ్యమునం దొక లెక్కలోనిది గాదను యంశమును సప్రమాణముగ లోకమునం జాటుటకై వేఱొకం గాంచి నేంటికిని ప్రపంచ మబ్బురపడుచున్నదో యట్టి యద్వితీయములును, నపూర్వములునునగు స్మారకచిహ్నములను స్థాపించి కీర్తిశేషుం డయ్యెనని స్ఫురింపక మానదు. ఇందులకు తార్కాణముగ 'తఖ్తు తావుస్' (మయూరాసనము) గూడ షాహాజహానుయొక్క మహద్వైభవములయం దొకటియై యున్నది. చెప్పుటకుమాత్ర మిది యొకయాసనమే గాని దీనియం దెంతటి కళాకౌశల్య మిమిడియున్నదో మఱియు నిది యెంతటి సౌందర్యస్వరూపమును గలిగి యున్నదో యావివరము నొక్కింత సంగ్రహముగ మాచదువరులీ క్రింది వివరణము వలనం దెలిసికొనియెదరు గాక.

షాహాజహానుచక్రవర్తి స్వాభావికముగ విభవాభిలాషి. ఇందువలననే తండ్రిస్థానమున కేతెంచినపిమ్మట నాతనికి షాహాజహాన్ (భూలోకప్రభువు)

యొను తన నామ మెల్ల తత్పూర్వరాజన్య నామములకంటె నెక్కుడు గౌరవ సమన్వితమై యున్నదో యట్లే తన కొలువుకూటము(దర్బారు) గూడ యనన్యసాదృశ్యమై వారల యాస్థానములకంటె వేయిమడుంగు లధిక మగు శోభాసమేతమై విరాజిల్లుచుండు నట్లు జేయవలయు నను నొక యభిప్రాయ ముదయించెను. ఈ యభిప్రాయమె యమూల్యరత్నసంచయస్థాపితము చేఁ గేవల మొక మూల్యమునందే గాక పనితనమునందుఁ గూడ నిట్టి దింకొకటి లేదని స్వభావోక్తిగఁ జెప్పఁ దగి నట్టి గద్దియ నొకదానిని నిర్మింపఁ జేయవలయు నను కోరిక యాతని హృదయమునందు స్థిరముగఁ బాదుకొనుటకు ప్రబలకారణ మయ్యెను.

ఈ కోర్కెను బూర్తిపఱచుట కాతఁడు రాజనగళ్లలోని ప్రత్యేక ధనాగారముల నుండియే గాక సాధ్యమయినంత వఱకు వెలుపల నుండు రత్నసంచయములను గూడ దెచ్చి సమకూర్చ వలయు నని రత్నశాలాధ్యక్షుండగు 'బేబదల్ ఖాన్' అను నధికారికి యుత్తరు వొసంగెను. ప్రభువాజ్ఞ యయిన పిమ్మట దర్బారులోనికి తేబడిన నానావిధము లగు రత్నములచే నొక్క పెట్టున నా కొలువు కూట మంతయు దేదీప్యమానమై వెలుంగుచు వానిలో నుండి వెడలుచున్న కిరణములు జూచువారల కన్నులకు మిరుమిట్లు గొలుపుచుండెను. తేఁబడిన రత్నములన్నియు నమూల్యములై యనుపమానములై యున్నను వానిలో నుండి గూడ మరల షాహజహాను చక్రవర్తి ముఖ్యమయినవియు మనోహరము లయినవియు నగు రత్నముల నేరెను. ఆ యేరిన రత్నము లేబదివేల మిస్కాలు లనఁగా రెండువేల తులముల తూనిక గలవిగ నుండెను. వీని మొత్తపు మూల్యము రెండుకోట్లరూపాయ లుండు నని "జవాహిర్ ఖుషాయె నాదిరి" యను గ్రంథమున వ్రాయఁబడి యున్నది ఈ రత్నము లన్నిటిని బేబదల్ ఖానున కిచ్చి యొకలక్ష తులముల మేలిమి బంగారముతోఁ గలిపి గద్దియను నిర్మింప వలయు నని యాజ్ఞాపించి దాని

నిర్మాణమును గూర్చి యొకపటమును వ్రాసి యది యుండవలసిన తెరంగును, వెడల్పును పొడవును నింక నిట్టివియే యగు మఱికొన్ని యితరాంశములను నొక సంపూర్ణకళాకౌశలుం డగు యుపాధ్యాయుఁడు నేర్పినట్లు బెబదల్ ఖానునకు బోధించెను

హిందూస్థానమును దర్శించుటకై తెంచిన సుప్రసిద్ధయాత్రికుం డగు 'డాక్టర్ బర్నియల్' అను వాఁడు దీని మూల్యమును గుఱించి రమారమి నాలుగు కోట్ల రూప్యముల కెంతమాత్రమును దక్కువగ నుండఁ జాలదని చెప్పుచు నీవిధముగ నాద్యంతము వెండి బంగారులతో నమూల్యము లగు రత్నములను స్థాపించి మఱియొక పీఠమును సిద్ధపరుప వలెనన్న నింతకంటె తక్కువ ద్రవ్యముతో నెప్పటికిని బూర్తి కాఁ జాలదని వ్రాసెను. పాదుషాహానామ (రాజచరిత్రావళి) యను చారిత్రక గ్రంథమును వ్రాసిన ముల్లా అబ్దుల్ మజీదు అనువాఁ డీపీఠముయొక్క మూల్యము మూఁడుకోట్ల రూప్యములని తెలిపెను. కొందఱు చారిత్రకారులు దీనిమూల్య మొక కోటిరూప్యము లని వ్రాయుటతోఁ దృప్తిఁ జెందిరి; గాని ఈపీఠమునం దమిడించఁబడిన రత్నములను షాజహానుయొక్క గౌరవవైభవభాగ్యముల నూహించి చూచినచో నొక కోటిరూప్యముల మూల్య మని చెప్పిన చారిత్రకారుల వ్రాతలు సత్యము లని మన మెప్పుడును విశ్వసింపఁ జాలము. తనకాలమున నొక సుప్రసిద్ధరత్నపరీక్షకుం డని పేరొందిన ట్యూవెనియర్ అను పేరుగల ఫ్రాంసు దేశపు రత్నవర్తకుఁ డొకఁ డీపీఠమును బహుదినములదనుక పరీక్షించి దాని మూల్యము నారుకోట్ల యేబదిలక్షలరూప్యములుగ నిర్ణయించెను. కావున నిరభ్యంతరముగ మన మీవాక్యము నంగీకరింప వచ్చును.

పూర్వోక్తవిధముగఁ జక్రవర్తి యాజ్ఞ యైన వెనుక నాగద్దియ యొక్క నిర్మాణకార్యము లారంభ మయ్యెను, బేబదల్ ఖానుని యాధిపత్యము క్రింద నీనైపుణ్యమునం దారి తేరి మిగుల చాకచక్యముగఁ బని చేయఁ గలిగిన

యోధులు పెక్కండ్రు నేమింపఁబడిరి. తరుచుగ షాహజహాన్ గూడ స్వయముగ నాపనిని బరీక్షించుచుండును, "ఆహా! ఈరా జెంతటి కళాకౌశల్యవిదుఁడో" యని యితరు లబ్బురపడఁదగినట్లుగ వారికయ్యై సందర్భములకు వలయు నుపాయములను, నూతనరచనాచమత్కారములను, జూపుచుండెను. ఇట్లొకదిన మేనియు నాపఁబడక నొక్కదీక్షగ నిర్మింపఁబడు మన్న సింహపీఠ మేడువత్సరములకు పిమ్మట సర్వాంగపరిపూర్ణమై కర్మశాల నుండి వెలుపలికి దేఁబడియెను. దానికి "తఖ్తుతావసు"(మయూరాసనము) అను పేరిడిరి. కవితామాధుర్యముచేతను, మృదుపదలాలిత్యముచేతను, నొప్పారెడు నొకశ్రేష్ఠం డీపీఠనిర్మాణము సమాప్తమైన వత్సరము శ్లోకపద్యార్ధమునం దిమిడ్చి చెప్పెను "సరీరె హుమాయూనె సాహెబ్ కురానీ" ఈవాక్యమునకు 'సర్వశ్రేష్ఠం బగు రాజాయొక్క మంగళప్రదమయిన సింహాసనము,' అని బాహ్యార్థము. గాని మనసంస్కృతభాషలో సంఖ్యలను వాక్యములతో వ్రాసి 'అంకానాం వామతో గతిః' యను సూత్రప్రకారము వెనుకనుంచి పదములను విడదీసి వానికి లక్ష్యము లగు సంఖ్యలనేరి వత్సరములను గనుగొనునట్లే పారసీభాషయందుఁ గూడ సంఖ్యలకు నక్షరసౌజ్ఞ గలదు. కవిశ్రేష్ఠులగువారే దేశచారిత్రికవత్సరమును దెలుపవలసినప్పుడట్టి పద్యములను వ్రాసి సంవత్సరము నం దిమిడ్చెదరు. ఈప్రకారముగఁ జూచినచో దానిలో వ్రాయఁబడిన వత్సరము ౧౦౪౪ హిజ్రియగును. (క్రీ॥శ॥1634)

అనంతరము తఖ్తుతావసు (మయూరాసనము) ను రాజదర్బారులోనికి దెచ్చి పెట్టిరి. ప్రపంచమునం దున్న మహాద్భాగ్య మంతయు నొకచో మూర్తీభవించినట్లు చూపరులకద్భుతము దోపఁ జేయుచుఁ దనయం దిమిడ్చఁబడిన రత్నములతోడను, కళాకౌశల్యముతోడను నాగద్దియ యపరిమితశోభాసమేతమై రాజవైభవమునకుం దగిన సంపూర్ణస్వరూపముతో విరాజిల్లుచుండెను. షాహజహానుచక్రవర్తి తన బుద్ధిచాతుర్యము నంతయును నుప

యోగించి చేయించిన యనుపమాన మని జెప్ప నొప్పు సింహగద్దియను సర్వాంగ సంపూర్ణ మైనదిగఁ జూచిన ప్రథమనిమిషముననే సంతోషము నొందెనో దానిని మే మిట వేరుగ మాకుఁ దోఁచి నట్లు వ్రాయక యావివరము "నొక మహోత్కృష్టకార్యమును దలపెట్టి తత్సమాప్తికై మిగుల పూనికతోఁ బాటుపడి దాని పర్యవసానఫలమును దనజీవితకాలముననే కాంచఁ గలిగిన యదృష్టశాలులకే విదిత" మని చెప్పుట సమంజసముగను స్వభావోక్తిగను నుండు నని తలంచుచున్నాము.

పీఠాధిరోహణమున కొకసుదివస మేర్పాటు కాఁబడిన పిమ్మట నా నాఁడు పట్టణ మంతయు మిక్కిలి శృంగారముగ నలంకరింపఁ బడియె భరతఖండ మందలి సుప్రసిద్ధు లగు పురుషపుంగవు లందఱును సమాహూయులై తత్తదుచితస్థానముల సభ నలంకరించిరి ఏర్పాటు కాఁబడిన శుభలగ్నమున కొక కొన్ని నిమిషములకు ముందుగ షాహాజహాను చక్రవర్తి రాజాధిరాజచిహ్నములతో దర్బారులోని కేతెంచి యత్యంతభక్తితోఁ గించిత్కాలము భగవంతుని మనంబున ధ్యానించి యాపిమ్మట తురాకీలోని పగు రెం డీశ్వరప్రార్థనాపద్యములను జదివి సభాసదు లందఱి తట్టు మరలి యిట్లు జెప్పెను.

"ఇంత వైశాల్యమును, నింతటి ఫలవంతమును నగు మహారాజ్యమును నాయాధీనమునం దుంచి నందులకును, కోట్లకొలఁదిగ నున్న మానవుల ప్రాణము లెల్లను నా యొక్కని యాజ్ఞాబద్ధము లై సంచరించున ట్లనుగ్రహించి నందులకును నేను సర్వశక్తియుతుఁడును, సర్వశ్రేష్ఠుఁడును నగు పరమేశ్వరునకు కృతజ్ఞతావందనముల నర్పించుచున్నాఁడను గతకాలమునందు ఫర్ ఊన్ నామకచక్రవర్తి నాతఖ్తున కీవిధమునను బోలి యుండని తఖ్తు నొకదానిని నిర్మించి తానే దేవుఁడ నని సాధింప సాగెను; కాని నే నా యద్వితీయుఁ డగు పరాత్పరుని మ్రోల లక్షమారులు వినమ్రుఁడ నయ్యెద

అని యొప్పుకొనుచున్నాను. మఱియు నాపాపములకు పశ్చాత్తప్తుండనై సభక్తికముగ సాగిలఁబడి యాజగత్కర్తను గూర్చి "యోరక్షకా! నన్నీప్రపంచమునందె ప్లౌకసాధికారపురుషునిగఁ జేసితివో యట్లే యంతమునందుఁగూడ నాకు నీకడ నొక గౌరవస్థాన మనుగ్రహింపవలయు నని ప్రార్థించుచున్నాను. ఎవని మాహాత్మ్యమును వర్ణింప నానాలుకకు శక్తి చాలకున్నదో యట్టి సృష్టిస్థితిలయకారకుఁడును, భక్తుల విన్నపముల నాలించు కరుణానిధియును నగు పరమాత్ముఁ డంత్యకాలమున నాకు చేయందిచ్చి దయతో రక్షించెడినిగాక.

ఇట్లు చెప్పి యాచక్రవర్తియును సభికులును గలిసి భగవత్ప్రార్థన (నమాజు) జేయ నుపక్రమించి మహమ్మదీయమతసాంప్రదాయక ప్రకారముగ నీశ్వరుని దృష్టిపథమునం దుంచుకొని యాతనికి సాష్టాంగ మెఱగిరి. నమాజు నుండి లేవఁగనె షాజహానుగడ్డముమీఁదనుండి జలబిందువులు రాలుచుండెను. ఆ దృశ్యమును గాంచి సభాసదు లందఱును నాసత్పురుషుని పశ్చాత్తప్తహృదయమున కద్భుతము నొందిరి.

ఇఁక నిచ్చట నుండి మాచదువరులకు తఖ్తుతాఉసు యొక్క మనోహర మగు స్వరూపపు ప్రతిబింబమును నివేదించెదము.

నెమలిగద్దియ యొక్క యెత్తైదుగజములు. వెడల్పు (2½) రెండున్నరగజము. పొడవు (3¼) మూడుంబావుగజము. ఇది స్వచ్ఛమైన బంగారముతోఁ జేయఁబడినదై యారుకాళ్లపై నిలిచి యుండును. దీనిమీఁది కెక్కుటకు మూఁడు సోపానము లమర్పఁబడి యుండెను. ఈసోపానములం దిమిడ్చిన యమూల్యము లగు జీవమణుల నుండి వెడలెడి ప్రకాశము చూపరుల కన్నులకు మిరుమిట్లు గొలుపుచుండెను. పీఠముమీఁద నతిసూక్ష్మతరమును నతిసుందరము నగు పనితనముతో రత్నములను దాపి చిత్రింపఁ బడిన పండ్రెండు స్వర్ణస్తంభములు, పైభాగమున వివిధము లగుమణుల

చేఁ గూర్పఁ బడి చుట్టును వ్రేలాడుచుండిన ముత్యముల జాలరిచే నొప్పుచున్న ఛత్రము నిర్వహించుచుండెను. ఈఛత్రముయొక్క లోపలి భాగమున జేయఁ బడిన యసమానమును, నతిమనోహరమును, నగు చెక్కడపు మీనాకారి (లత) పనితనము భగవంతుఁడు మానవున కనుగ్రహించిన బుద్ధినైశిత్యమును వేయి నోళ్లఁ బ్రకటించుచుండెను. ఈతఖ్తుపై సాహజహాను చక్రవర్తి తన రాజచిహ్నముల నన్నిటిని ధరించి కూర్చుని యున్నప్పు డెల్లను నవరత్నఖచిత మగు ఛత్రము నుండి వెడలుచుండెడి తేజోకిరణములాతని సుందరస్వరూపముపై ప్రతిఫలించి యాసౌందర్యము నినుమడింపఁ జేయుచు నొకవిధ మగు నూతనశోభ నొసఁగుచుండెను. తఖ్తులకు రెండు పార్శ్వముల వజ్రవైడూర్యాదిమణులచే నలంకరితము లగు రెండు చక్కని మయూరములు, పచ్చలచే నిర్మింపఁ బడిన తమ ముంచువుల యందు మంచిముత్యముల మాలల నిడుకొని నానావిధరత్నఘటితము లైన పింఛములను రెక్కలను విప్పి నీడ నిచ్చు నట్లుగ చిత్రింపఁ బడి యుండెను. ఈ నెమళ్లు దమయం దిమిడింపఁ బడిన మణులచే ననుపమానము లై యొప్పారుచుండెను.

ఈపనివాని నేర్పరితనమును గాంచి "బర్నియర్" అను ఫ్రాంసుదేశవాసి యగు నొకయాత్రికుఁడు తమదేశమునం దాకాలమున శిల్పిశాస్త్రమునం దద్వితీయుఁ డని పే రొందిన యొకపనివాఁ డుండె ననియు, నాతఁడు కల్పితరత్నములను నిజరత్నము లని విక్రయించిన నేరమునందు బట్టుబడి తా నొనర్చిన దుష్కార్యమున కయ్యెడు శిక్షకు వెరచి హిందూస్థానమునకు పారి వచ్చె ననియును, నీమయూరాసనముపై నున్న యత్యద్భుతశిల్పము లన్నియుఁ దప్పక వానిచేతనే చేయంబడి యుండ నోపు ననియును నిర్భయముగ వ్రాసెను. కాని చరిత్రకారులకడ నీబర్నియర్ యొక్క యభిప్రాయ మణుమాత్ర మేనియు గౌరవింపఁ బడక పోవుటయుండ మీఁదుమిక్కిలి [illegible] [illegible]

డపు నప్రతిమ మగు కళాకౌశల్య చాతుర్యగరిమను గాంచి సహింపఁజాలక యీశఁ డిట్లు తన యోరువలేమిని బ్రకటించె నని యైకకంఠ్యముగ నొప్పు కొనిరి. తఖ్తుతావుసున కిరుప్రక్కల నుండెడి యామయూరముల మధ్యభాగ మున నొక్కొక్క పెద్దవజ్రము స్థాపింపఁబడి యుండిన తమ యుదరముల నొయ్యారమునఁ బై కుబికించి చూచువారికి సజీవములో యని తోఁపఁ జే యుచు మిక్కిలి విమర్శగఁ బరికించి చూడనిచో నివి నిర్జీవప్రతిమ లని తెలుసుకొనుటకు కలవిగా నట్లు నిలుపం బడి యుండెను. తఖ్తునకు వెనుక భాగమున నొక బంగారపుచెట్టు గలదు. దాని కొమ్మలలోఁ దెల్లని మణు లును, యాకులలోఁ బచ్చని మణులును దాపఁబడి యుండెను. దాని కమర్పఁ బడిన రత్నస్థగితము లగుపండ్లు మిక్కిలి మనోహరముగ ద్రాక్షగెలల వలె వ్రేలాడు చుండెను. ఈచెట్టునందలి పనితనమును వీక్షించు నపు డు దానియం దమర్పఁ బడిన యమూల్యరత్నములుగూడ నా యనన్య శిల్పచాతుర్యముకడ నొకలెక్కలోనివిగఁ గనుపింపవు. మయూరాసనము నందు పలకల వలె ననేకవిధము లగు మణులచే నిర్మింపఁబడిన భాగములు పదునొకండు గలవు. వానిలో వెనుక తట్టు చక్రవర్తి యానుకొని కూ ర్చుండు (తకియా) పలక మిగుల ప్రాముఖ్య మయినది. దాని వెల పదిల క్షల రూప్యముల కే మాత్రమును దక్కువకా దని రత్నశాస్త్రవేత్తలు నిర్ణ యించిరి. ఈతకియావు మధ్యభాగము నందు చరిత్రములో సంబంధించి యున్న రత్న మొకటి దేదీప్యమానముగఁ బ్రకాశించు చుండెను. ఆరత్న మును ఈరాన్ (పర్షియా) రా జగు షాహా అబ్బాస్ సఫీవి తన మో తము దగు (శక్రిటరీ) జంబీర్ బేగును రాయభారిగ నంపి నప్పుడు జహాన్ గీరుచక్రవర్తికి కానుకగ నంపెను. దీని మూల్యము పదిలక్షలుగ నుండు నని యాకాలపు మేధాసంపన్నులు నిర్ణయించి యుండిరి. ఇది మన షాహాజహానునకు తక్కిన సకల భాగ్యములతో పాటు వారసత్వమున బ్బినది కాదు. దఖ్ఖన్ (దక్షిణ) రాజ్య మాతని సైన్యానాయకత్వము

క్రింద జయింపఁబడె ననుసువార్త తెలిసినప్పుడు సంతోషపూర్వకముగ జహాఁగీరుచే షాహజహానునకు బహుమానముగ నీయఁబడినది. ఈరత్నముపై మొదట "సాహేబు కురాఁ అవ్వల్ మిర్జా షాహరుఖ్, మీర్జాఅనాబేగ్" అను 3 పేరులు చెక్కఁబడియుండె ననియును దరువాత కాలవశమున షాహ అబ్బాసు సఫ్‌లీకి లభ్యమయినప్పు డాతఁడు గూడ నద్దానిపై తననామమును జెక్కించుకొనె ననియును నాపిమ్మట షాహజహాను తన తండ్రిపేరును దనపేరు సైతము చెక్కించియుండె ననియును జెప్పుదురు. ఇట్టి చారిత్రకమగు మహామణియొక్క యదృష్టమునం దిద్దరు సార్వభౌములు స్వాధీనమునం దుండిన వెనుక మయూరాసనమును శోభింపజేయుట కంపలి యలంకారమునై నిలిచి యుండు మని వ్రాసి యుండ నోపు నను నట్లు చివర కివ్విధముగ నారత్నమునకు స్థిరస్థాన మేర్పడియెను.

తఖ్తు తావసు పైకి దృష్టి సారింపఁగనే యన్నిటికంటె ముందుగ మనచూపులను దనపైపున కాకర్షించుకొనునవి 'హాజీ మహమ్మద జాన్ కుద్సీ' యను కవిశ్రేష్ఠునిచే రచియింపఁబడిన చారిత్రకము లగు పద్యము లయి యున్నవి.

ఇవి యాతఖ్తుపైఁ జేయఁబడిన బంగారపు పనితనమునం దచ్చటచ్చట సందర్భమున కనుకూలమగునట్లుగ దివ్యసుందరము లగు నక్షరములతోఁ జెక్కఁబడి యుండెను. నాలుగుపాదములు గలిసి రెండు చరణము లగును. పర్షియన్ భాషలో దీని నొక్కొక పద్యముగ భావించెదరు. తెలుగులో నున్నట్లు యతిప్రాసలనిర్బంధ మీభాషలో లేకయున్నను నంత్యనియమములును, యే యే పద్యపాద మెంతగ నుండవలెనో యావిషయమైన యక్షరనిబంధనలును గలవు. ఆపద్ధతి ననుసరించి యీపద్యములు "మస్నవీ" యను పేరిటి పద్యతరగతిలోఁ జేరును. మహమ్మద్,

జాన్ గారు తఖ్తును సూచించు (౪౦) నలువది పాదములుగల (౧౦) పదిపద్యములను వ్రాసిరి. పదస్వారస్యమును, అర్థాలంకారమును జూచి వానిలో దేనిని గూడ విడుచుటకు నిచ్ఛలేక కాఁబోలు షాహాజహాను వాని నన్నిటిని సంపూర్తిగఁ దనగద్దియపైఁ జెక్కించెను. ఈపద్యములు పర్షియన్ భాషలో రచియింపఁ బడుటచే మన తెనుఁగులో వ్రాసి చూపుటంత సమంజసముగ నుండక పోయినను చారిత్రాత్మికము లగుటచే శాసనముల యందును, నితిహాసములయందును బేర్మిగలవార లీగద్దియయందు వ్రాయఁ బడిన పదములను వినుటకు తప్పక ప్రేమింతు రని యోచించి వాని నిట్చట వ్రాసి యేపాదమున కగ మాపాదమునకింద వ్యాఖ్యారూపకముగఁ వివరించెదను

## మస్నవి.

I (1) జోహే ఫరఖుండ తఖ్తె బాదుషాహ్
ఆహా! ఈరోజు గద్దియ ఎంత పవిత్రతర మయినదిగ నున్నది.

(2) కెషుద్ సామానె బతోయీదె ఇలాహ్
ఏలయన దీనిసాధనము లన్నియు భగవత్సహాయముచే సమకూరెను. (అనఁగా దీని నిర్మాణమున కంతయు నాతఁడే ప్రయత్నకారకు డయ్యెనని భావము.)

(3) ఫలక్ రోజే కెమీకర్దష్ పెశకష్మీల్
ఏదినమున వైశమీప్రయత్నమును (ఈసాధనములను సేకరించుట యను పనిని) నిశ్చయము జేసెనో!

(4) జరెఖుర్షీద్ రావెగుదాఖ్తు అవ్వల్ — (ఆదిమ్మట) ప్రప్రథమమున సూర్యునిలోనున్న బంగారమునంతను గరగించెను (సూర్యునిలో సువర్ణ మున్న దని యొకమతము గాన దాని ననుసరించి యీసువర్ణమును దీనికొఱకు భూమిపై కనిచె నని భావము)

II (1) ఒహంక్మ కారెఫర్మా సరఫ్ షుద్ షాక్ — ఆ(పనిని దలపెట్టిన) యధి
కారి (అనఁగా షైషము అని భావము) యొక్క యాజ్ఞవలన సర్వ
స్వము వ్యయ మగ్యెను.

(2) బహీనాకారిద సహీనాయెఆఫ్లాక్ — దైవశక్తి యందలి కౌశల్య
మంశయును దీనియొక్క పనితనమున కై (మొదటి పాదముతో
నన్వయము పూర్తి యగును.)

(3) జుజీతఅ ఆబ్ జర్దెగౌహర్ చెమష్వంద్ — ఈగ్గ్రయముం దుపయో
గింపఁ బడుటకు గాకపోయినచో (నిఁక) నీవజ్రములయొక్కయు
బంగారముయొక్కయు (సృష్టికి) యుద్దేశ మేమి?

(4) బజూర్ బహార్ కాణ్ రాహిక్ మత్ ఈఁబూద్ — సముద్రము యొ
క్కయు గనులయొక్కయు నుత్పత్తిస్థితులకు గూడ నిదియే యోచన
(కారణము)మై యున్నది. (అనఁగా సముద్రమునం గల రత్నములు
గనుల యందలి రత్నములును దీనిలో నున్న వని భావము)

III (1) జ్యాహూతష్ కెదర్ కై దెబహా నేస్త్ — దీనిలోని యరిటిరత్న
ములకు మూల్యమే (నిర్ధారణ) లేదు (అమూల్యము లయినవి).

(2) లజేలా లెబుతాఁరాజిల్ బజా నేస్త్ — సౌందర్యవతియొక్క పె
దవి ఈరత్నములను చూచి (తా నట్లు లే నని) విచారపడు
చున్నది.

(3) బరాయెపాయేఅష్ఊంరేక షేద — దీని (ఈగద్దియ) యొక్క
కాలిగాఁనికై వచ్చుటకై (ఎక్కువ) వయఃకాలమును నిరీక్షణలో
గడపినవి.

(4) గోహరెఅఫ్సర్ బసర్ ఖాతంజేదీద — తలలయందలి కిరీటములు

లోను సంగరములయొంపలి గూడులలోను ఉంచఁబడిన రత్నములు
(3 వ పాదార్థముతో అన్వయము.)

(అనఁగా) రాజులకిరీటముల యొంపలియును, సంగరముల యొంపలియును నగు మణులు తా మీగద్దియకాలిలోని కెక్కించుట యెక్కుడుగౌరవ మని తలపోసి నిరీక్షణయం దుండెను. (అట్టి వెల్ల నిప్పు డిందులో నున్న వని భావము)

IV (1) జవరహి ఆలెంజక్ జర్ షుద్ జహాఁ పాక్ — దీని చెక్కడమునకై ప్్రపంచములోని బంగార మంతయును వ్యయ మయ్యెను.

(2) కెషుద్ అజ్ గంజ్ ఖాలీకి సైఖాక్ — అనఁగా భూదేవిగర్భమునం దున్న దివ్యభాండారపు సంచి యంతయు వట్టి దయ్యెను.

(3) రసానద్ గర్ ఫల్క్ ఖుదా్రి బెపాయిష — ఒకవేళ నాకాశము తన్ను దా నీగద్దియపాదముల యొద్దకు దెచ్చికొనినచో

(4) దెహద్ ఖుర్ షేద్ వమైరారూనుమాయష్ — సూర్యుని చంద్రుని దీనిముఖాలంకారమునకై (కానుకగ) యిచ్చి వేయును.

V (1) సర్వరాజీ కెసర్ బరు పాయేఅష్ బూద్ — ఎవరిపాదము లీతఖ్తుపై నున్నవో యాగౌరవనీయుఁ డగు మహాపురుషుఁడు

(2) జ గిర్దూ నెపాయేబర్ తఖ్తె అఫ్లాద్ — ఈతఖ్తుయొక్క గొప్పఁదనమును నాకాశముకంటె నధిక పఱచెను (ఆకాశపీఠము నందు దైవ మధిష్ఠించి యున్నాఁ డని ఇస్లామీ మతము)

(3) ఖిరాజెబహారెకాఙ్ పైరాయేఉశ్ — సముద్రములును, గనులును దీని యలంకారములకే యుండెనవి.

(4) పనాహెఅర్ష్ వకుర్సీసాయేఉశ్ — అర్ష్, కుర్సియను నాకాశములు, దీనినీడలోనికి రాఁగలవు. (ఏడాకాశము లున్నటుల మహమ్మ

దీపమాత్రము. వానిలో మొదటిది నక్షత్రియుతము రెండవ దన్నిటికంటె పైది) (గౌరవమున వానికంటె నీగద్దియ మిన్నంటి వానిని తన నీడ క్రిందను పెమ్పుకొనె నని కవి భావము )

VI (1) జ్ ఆన్వాజవాహర్ గష్తయేఐవాక్ — నానావిధరత్నముల కూర్పుచే విరాజిల్లు నీహర్మ్యము యొక్క (యానజ్యోతి) దీప్తి యెట్లయిన దనఁగా

(2) చిరాగె ఆలమె పర్వానైఅక్ — సృష్టిలోని ప్రజ లంతయు దీనికి (దీపమును జూచి దానిచుట్టు కరు దెంచెడు స్వభావముగల) శలభము లైరి.

(3) దర్ అత్రాఫ్ బూమ్ గుల్హా యెసీనా — దీని ప్రక్కల యందు జేయఁ బడిన తీగెల చిత్రికములోని పుష్పము లెట్లు ప్రకాశించుచున్న వనఁగా

(4) ఫరోజానె చూఁ చిరాగ్ అజ్ తూరెసీనా — తూరెసీనా యందలి దీపమువలెఁ బ్రకాశించుచున్నది. (తూరెసీనా యను పర్వతముపై దేవుఁ డెక్కి భక్తులతో సంభాషించె నని మహమ్మదీయమతము. అందుచే నాయనకాంతి యెప్పటికిని నాపర్వతముపై ప్రతిఫలించుచు జ్యోతి యై ప్రకాశించు చుండు నట)

VII (1) చూమీకర్ద్ అజ్ ఫరాజష్ కో తెహీదస్త్ — ఔన్నత్యమునందు తన చేయి వెను కయ్యెను.

(2) నగినె ఖ్వేష్ జంబర్ పాయే కష్ బస్త్ — ఇందువలన జంషీదు తన రాజముద్రను నీగద్దియ యొక్క పాదమున కంటఁ గట్టెను. (జంషీదు అను నాతఁడు ప్రాచీనకాలమునఁ బారసీకమునం ద

విఖ్యాతిగల దొకచక్రవర్తి. ఆయన యౌన్నత్యమునగూడ నీరాజు యొక్క యౌన్నత్యమునకు సరిరాదని యర్థము అనఁగా సర్వ రాజాధిరాజుల శిఖాయుంగరములలోని మణులవంటి యనేకములు దీనికాలియందున్న వని భావము (మొదటిపాదములో నన్వయము పూర్తి.)

(3) సబేతాంజ్ ఫిరోగ్ లాల్ వగౌహర్ — (ఈగద్దియు) గాఢాంధకారపు రాత్రిని (దనయందలి) వజ్రవైడూర్యాదిరత్నముల ప్రకాశముతో

(4) తవానద్ సద్ ఫల్క రాదాద్ అఖ్తర్ — ఒకవేళ దలఁచినచో నూరుఆకాశములకు నక్షత్రములను రచియింపఁగలదు.

VIII (1) దెహద్ షాహెజహాఁ రాజో సైఁర్ పాయ్ — షాజహాను యొక్క పాదమును ముద్దిడుకొనుచున్నది.

(2) అజాఁ షుద్ పాయకద్ రిషఫల్క సాయ్ — ఇందువలననే యీతఖ్తుయొక్క గొప్పదన మాకాశము(దైవపీఠము)తో సరియైనది. (అని చెప్పవలసి వచ్చినది.)

(అనఁగా రాజునందు దైవాంశము గలదు గాన నీతఖ్తుగూడ నాతఖ్తునకు సరి యని భావము)

(3) కునద్ షాహెజహాఁ బఖ్షిషజవానెబఖ్త్ — అతిఘనతగలవాఁడగు నీషాజహాను దాతృత్వమునం దత్యుత్కృష్టుఁడు.

(4) ఖిరాజెఆలమీరాఖిజ్హయేక్ లఖ్త్ — ప్రపంచపు రాబడియంతయు నొక్కనిమిషములో వ్యయపఱచును.

IX (1) ఖుదావందేకె అజ్ నూరిష్ ఆఫ్తాబ్ — ఆకాశ(సీర)మును నిర్మించిన దేవుఁడో యాదేవున (ఆవిశఁకర ) కు మాఁత్రమే

(2) తవానద్ ముద్రతుహత తఖ్తే చునీసాఖ్త్ — ఈవిధ మగు గద్దెయును రచి యింపఁ జేయుటకు శక్తి గలిగి యుండుట సంభవము గానో పును (ఒరులకు గా దనిభావము)

(అనఁగా షాహాజహానుయొక్క మయూరాసననిర్మాణయోచనా నైపుణిని మించినవాఁ డెవఁడున్నచో నట్టివాఁడీక భగవంతుఁ డే యని యర్థము)

(3) అసర్ బాకీ తాకోనోమకాఖ్ రా— భూమ్యాకాశములయొ క్క గుర్తు లెంతదనుక నిలిచి యుండునో

(4) బువద్ బర్ తఖ్తె జా షాహేజహాఖ్ రా— (అంతదనుక) ఈతఖ్తు పైన షాహాజహానుయొక్క స్థలము నిలిచి (స్థిరమై) యుండు గాక. (ఆశీర్వాదము)

X (1) బువద్ తఖ్తే చునీహా ఫ్రోజ్ జాయష్— ఈవిధ మైన గద్దియయే ప్రతిదినము న్యాయునకు కూర్చుండు స్థల మగుగాక.

(2) ఖిరాజేహఫ్త్ కిష్వరెజేరెపాయష్— సప్తఖండముల కప్పము లీగద్దియక్రింద నమరి యుండు గాక.

(పృథివియంతయు దీనిపై నధిష్ఠించి యుండెడు పురుషుని యాధి పత్యమునం దుండెడుగాక యని యాశీర్వాదభావము)

(3) చూఁ తారీఖెజబాఁ పుర్సీద్ ఆజ్ దిల్ — దీని(జనిత)కాలమునుగూ ర్చి (నిర్మాణసంవత్సరమును) నాలుక హృదయము నడుగఁగఁ గా

(4) బెగుఫ్త్ ఔరంగ్ షహాఖ్ షాహె ఆదిల్ — ఇది న్యాయమును దయచేయు నట్టి చక్రవర్తియొక్క గద్దియ యని (హృదయము బదులు)చెప్పెను (నాలుగవ పాదము నందలి యక్షరము లన్నింటి

కేర్పడి యున్న సాంకేతికసంఖ్యల నొకచోఁ జేర్చి కూడినచో ౧౧౪౮ వచ్చును. ఇది హిజ్రీ శకము.

(ఈగుర్తు వేయఁబడిన స్థలముల యందలి శబ్దములు అనునాసికోచ్చారణములు.)

మయూరాసనమునకు ముందుప్రక్కగ, బంగారపు పనితనముతో మధ్యభాగమును గప్పి యున్న పచ్చలపందిలి యొకటి కలదు. అది నానా విధము లగు యింద్రనీలములు, పచ్చలు మొదలగువాని తోడను, నలుముఖముల వ్రేలాడు చుండు జరితారు జాలర్ (బంగారపు నీటిచేఁ బూయఁబడిన దారములతో నల్లిన కుచ్చుల వల) యందత్యలంకారముగ నమరి యున్న యాణిముత్యములతోడను నతి తేజోవంత మై, గంగాయమునా నదుల యందలి స్వర్ణముచేఁ జేయఁబడిన స్తంభములపై నిలిచి యుండెను. దాని కిరుప్రక్కలను అమీరులు, ఉమ్రావులు, మంత్రులు మున్నగుప్రముఖులాసీను లై యుండుటకై తత్తదర్హము లగు నాసనము లలంకరించి యుంపఁబడి సభాభవనపు కళాకాంతుల నినుమడింపఁ జేయు చుండెను. రాజాధిష్ఠిత భాగమును బ్రత్యేకపఱచి తత్సారవాధిక్యతను సూచించు నట్లుగ గద్దియచుట్టును రెండుగజముల స్థలమున కప్పల వెండివలతో (కటకర్) నొక యావరణరూప మేర్పరుపఁబడి యుండెను. ఆ వలయందు చిత్రింపఁబడిన లతాకౌశలము చూచువారల దృష్టిని తనపై నిలువ నీయ కుండు నంతటి సూక్ష్మతర మై, యతిసుందర మై మనోహరముగ నుండెను. ఇఁక నిచ్చట మే మీమయూరాసనపు స్వరూపవర్ణనమును సమాప్తి పఱచి దీనిని గుఱించి బర్నియర్ యొక్క యభిప్రాయమును మిగుల విచారముతోఁ జదువరులకు నివేదించెదము. ఆయన యిట్లు చెప్పెను. "దీని యందలంకరితము లై యున్న యసంఖ్యాకములును, నతి మూల్యవంతములును నగు రత్నములచే నిది యొక యమూల్యాసన మని చెప్పుట కభ్యంతర మేమియును లేదు; కాని యిదియే "ఏషియా" (ప్రాక్ప్రపంచము) యందలి కళాకౌశలము యొక్క

సర్వోత్కృష్టమగు మాదిరి (నమూనా)యని చూపించుటకుఁ దగి నంతటి గొప్పపనితనము మాత్ర మిం దేమియును గాన్పింపదు. జీవమణులయొక్క ప్రకాశముచేఁ గన్నులకు మిరుమిట్లు గొలుపు చున్న కాంతివైభవము తప్ప దీని నిర్మాణమునం దిం కేమియును వర్ణనీయ మగు విషయము గాన రాదు."

ఈ "డాక్టర్ బర్నియర్" ఒకవేళ నితరాంశములను వివరించు సందర్భములయం దున్న దున్నట్లు వ్రాసి తనన్యాయదృష్టిని బ్రకటించుకొని యుండును గాని యీవిషయమునం దిచ్చిన యభిప్రాయము మాత్రము సంపూర్ణ మగు నన్యాయముతో మిశ్రితమై యున్నది. ఈస్థలములం దాత డొక చారిత్రకారుని వలె తన కలమును బక్షపాతరహితముగ నడుపక యీ రూపముగఁ దన్ను దా నొక యోరువలేని పరాసీయునిగ ధృవపఱచుకొని యెను. ప్రాగ్దేశీయకర్మకౌశల మెంత స్తుతిపాత్రమైనదిగ నున్నను నది యాతని దృష్టికి హృదయకంటకముగ నుండెను గదా!"

మయూరాసనముపై మొగలాయి ప్రభువులు నాదర్‌షా దాడి కేతెంచు దనుక మిగుల వైభవప్రతాపములతో నాసీను లగు చుండిరి. గాని ౧౧౫౧ హిజిరీశకమునం దీ యీరానీ (పారసీక) సరదారుఁడు మహమ్మదుషా యొక్క సుఖలోలతను నాతని సైనికుల బలహీనతను, ప్రజానురాగశూన్యతను గూర్చిన వార్తా పరంపరల నాకర్ణించి హిందూస్థానపు సౌభాగ్యమును జూరగొనుట కై కాలాంతకులో యనునట్టి ఈరాన్, అఫ్గాన్, సైనికుల సాయముతో భారతభూమిపై విరుగఁబడియెను. ఆనాఁటికి దోపుడుసమయము నందు వారికి దొరకిన యపరిమితమగు భాగ్యములో "దేనిని షాహాజహాను సార్వభౌముఁ డతిప్రేమతో నతిశ్రద్ధతో నత్యంత శ్రమతో నిర్మింపఁ జేసెనో మఱియు నేది హిందూస్థానమునందే గాక ప్రపంచము నందన్ని చెరగుల వారిచేతను నుపమానరహిత మగు గద్దియగ భావింపఁబడు చుండెనో యట్టి మయూరాసనము గూడ నొకటియై ఈరానుకు ప్రవేశించెను.

"జహాఁకోషహాయెనాదరీ" (నాదర్ యొక్క ప్రపంచ విజయము) యను గ్రంథమునం దాగ్రంథకారుఁ డిట్లు వ్రాయుచున్నాఁడు "మయూరాసనముగా హాటించ ననేకము లగు యమూల్యపదార్థము లనఁగా ముత్యములు, వజ్రములు, కెంపులు, మొదలగు రత్నములును నానారూపములు గలిగి వివిధనామములచే బేర్కొనం బడు యసంఖ్యాకములును నతిప్రకాశమానములును నగు నాభరణములు నాదరు వెంట ఈరానుకు జేర్పఁ బడియెను. ఈలోకము నందలి యేభాగ్యవంత మగు ప్రభుత్వ మైనను వానిలో నొకదాని కైనను దుల్య మగు పదార్థమును దన యొద్దనుండి మాపఁ జాలదు."

ఇవ్విధముగ నాదరుషా హిందూస్థానపు సంపద నెల్లను దోఁచుకొని ఈరానున కరిగి పిమ్మట వెంటనే స్వయముగ నాయకుఁడై సైన్యమును నడుపవలసి నంతటి దుర్ఘట మగు పోరాట మెద్దియో యన్వలఁ దటస్థించుట వలన నీద్రవ్య సంచయము నంతయు హారాత్ (హిరట్) యను పట్టణమున కంపి తనక్రింది యుద్యోగస్థుల కిట్లాజ్ఞాపించెను. "నేను తిరుగ నేతెంచు దనుక సైన్యమంతయును నీద్రవ్యరక్షణము గావించుకొనుచు నిందే యుండవలయును. మఱియు నేను తిరుగ నేతెంచు నంతలో హిందూస్థానము నుండి కొల్లగొట్టి తెచ్చిన రత్నములతో నొకతఖ్తును నిర్మింప వలయును. అదియేయంశమునను మయూరాసనమునకు తీసిపోగూడదు. మనలో సాధారణముగఁ గొండఁటధికారుల కెదురుమాటజెప్పఁజాలని యుత్తరువులకు సుగ్రీవాజ్ఞ యని పోల్చి చెప్పెడి వాడుక గలదు. ఆకాలమున సుగ్రీవుఁ డంతటి కఠినశాసనుఁడై యుండనోపును. అట్లే మహమ్మదీయులలోఁ గూడ హుకుంనాదర్ షాహీ యను సామెత వాడుకయం దున్నది. తప్పక జరుగ తీరవలసిన పనులను గూర్చి యీమాట నుపయోగించెదరు దీనినిబట్టి నాదర్ షా తనకాలమునం దొక చండశాసనుం డై యుండె నని మన మూహింప

వచ్చెను. ఇట్టి మీరంజాలని నాదరుషా యాజ్ఞయొక్క యనుష్ఠానమునం దాలస్య మొనరించు టేరికి తరమగును? తక్షణమే పటము (ప్లాను) సిద్ధ మయ్యెను. ఈరాను దేశీయులును హిందూదేశీయులును నగు పెక్కండ్రు కర్మకారులు నియోగింపఁ బడి పని నారంభించిరి. పనివారల హృదయములయందు నాదరుషా యొక్క భయ మెక్కుడుగ నుండుట చేతను, దండయాత్రనుండి తిరుగ నేతెంచుటకు పూర్వమే గద్దియ సిద్ధము గావలయునని యాతఁడు గావించిన కఠినపుగు యాజ్ఞ తమ్మనవరతము నాతురత పఱచుచుండుట చేతను నానిర్మాణకార్య మింతింతని చెప్పుట కలవికాని వేగముతోఁ బూర్తి కాసాగెను. దివారాత్రములయం దొకనిమిషము నేనియు వృథ గా నీయక నివ్విధముగ నెంత కష్టించి పని చేసినను నొక సంవత్సరకాల మీనిర్మాణమునందు వ్యయ మయ్యెను. తరువాత దీనికి తఖ్త నాదరీ యని పే రిడిరి. మయూరాసనమున కై యెంతటి స్వర్ణ ముపయోగింపఁ బడెనో దానియం దెన్నిరత్నములు స్థాపింపఁ బడెనో యీతఖ్త యొక్క నిర్మాణమునందు గూడ నంత స్వర్ణముతో నన్ని రత్నములతోఁ బనిఁగొనిరి; కాని ఇవ్విధముగ నెంతటి యసామాన్యవ్యవస్థలతో సిద్ధపరిచినను పైని మీ రెంటియందును శాశ్వత మగు భేద మేర్పరుపక పోలేదు. ఏమన, తఖ్తతావసు (మయూరాసనము)యొక్క వృత్తాంతము కొంచె మెచ్చు తగ్గుగ నీలోకము నందు గల జనుల కందఱకు నెరుక యై యున్నది. తఖ్త నాదరీ యొక్క సంగతిమాత్ర మెవ్వరికిని దెలియదు. తెలిసి యున్నను వారి సంఖ్య యత్యల్పము.

మయూరాసనము యొక్క సౌందర్యము, కళాకౌశలము, ప్రపంచము నందంతటను నలిగాంచి యుండుటయును నాదరీతఖ్తకూడ యంతటి మూల్యముతోడనే నిర్మింపఁ బడినను నది యూరు పేరు లేని యొక మారుమూలను బడి యుండుటయును నిదియే పైనఁ జెప్పఁ బడిన భేదమున కొ

క కారణముగఁ గన్పట్టు చున్నది. ఇదిగాక మఱిరెండు ప్రబలహేతువు లగు పడు చున్నవి. అందు మొదటిది ప్రప్రథమమునం దీమయూరాసనము యొక్క పటము కళాకౌశల్యమునఁ దత్యుపాయ చతురిమ గల షాహాజహానుచే స్వయముగ సిద్ధ పరుపఁ బడినది. రెండవది; మయూరాసన నిర్మాణమున కర్మకారులకు తగినంత యోపికతోఁ దమకళాకౌశల్యమును జూపించుట కవకాశము దొరకెను. ఇందువలననే నది యేడువత్సరముల కాలములోఁ బూర్తి యయ్యెను. దీనికి వ్యతిరేకముగ తఖ్తు నాదరీ యొక్క నిర్మాణము నాదరీ యాజ్ఞ యత్యుగ్రమై యుండుకతన మిగుల వేగముగను, నసంతృప్తికరముగను నెరవేరెను. నాదర్ షాహ దండయాత్ర నుండి యెప్పుడు తిరుగ నేతెంచునో యాతఁడరు దెంచు నప్పటి కీగద్దియ పూర్తిగాకున్నచో నేమి శిక్షించునో యను భీతి ప్రతి నిమిషమును దమహృదయములను వేధించు చుండుటచేఁ బనివాండ్రు తఖ్తు నందు తమకళాకౌశల్యము నిచ్చ వచ్చినట్లుగ నగు పరుపఁ లేక పోయిరి.

నూతనతఖ్తు సిద్ధమైన యనంతరము నాదరుషా దానిని మయూరాసనపు చేరువ నుంచి కొంతకాలము దనుక రాజోచితోత్సవములను సల్పుచుండెను; గాని తనచేఁ జేయింపఁ బడిన తఖ్తునకు మయూరాసనమునం గల కాంతి కౌశల్యముల యందలి పోలిక యొక్కింతేనియు నమరి యుండ లే దని యెఱింగియే యున్నవాఁ డగుటం జేసి యాతనికి తఖ్తు తాఊసు నందు గల గౌరవభావము తఖ్తెనాదరి యం దెప్పటికిని గలుగ దండెను.

నాదరుషా మయూరాసనమును ఈరానునకు తీసుకొని వెళ్లుటయు దానిని తఖ్తెనాదరీ యొద్దనుంచి యుత్సవములు జరుపు చుండుటయు ననివి నిస్సందేహములుగ ధృవపడి యున్నవి. గాని నాదరుషాహా యొక్క యనంతర మీమయూరాసన మెచ్చటనుండెను? ఎవరియొద్దనుండెను? అనువిష

యములను గుఱించి యోచించి చూడఁగా ఈరాన్ దేశము పై యిప్పటినుం డి నేఁటివఱకు పరదేశీయులచే నేసిన రాజ్యాక్రాంతి జరిగినట్లు చరిత్రములవలనఁ గాన్పింపదు; గాన కాలవైపరీత్యముచే నిది యచ్చటనుండి మఱియొక విదేశీయభాగ్యమునందు సంక్రమించి పోయిన దని గాని లేక స్వరూపవినాశన మై నామమాత్రావశిష్ట మైన దని గాని భావింపఁ గూడదనియును, నాదరుషాకు పిమ్మట నిప్పటివఱకును నది ఈరానునందే యుండి ఈరాన్ ప్రభువుల యధీనముననే చెందియున్నదనియును మన మూహింప వలసియున్నది. మఱియు ముజఫరుద్దీన్ షాహార్ యొక్క మరణానంతర మతని పుత్రుని (ప్రస్తుతము పదభ్రష్టుఁ డైన యాతని) సింహాసనాధిష్ఠితోత్సవ మీమయూరాసనము నందే జరిగియున్నట్లు వార్తాపత్రికలలోఁ జదివియున్నాము గాన నిది తన స్వరూపమునందు మార్పు నొందక ఈరానుదేశమునందే యున్న దని భావించుటకే యభ్యంతరమును గానరాదు.

అక్కటా! ౧౦౪౪ హిజిరీశకము మొదలు ౧౧౫౧ హిజిరీశకము వఱకు ౧౦౭ సంవత్సరముల కాలమవిచ్ఛిన్నముగ మొగలాయి సార్వభౌముల రాజ్యపీఠముగ నుండిన మయూరాసన మాపిమ్మట భరతమాతను వనవియోగచింతం బడఁద్రోసి యామెనుండి శాశ్వతముగ విడి పూర్వోక్తవిధముగ ఈరాను భాగ్యములోఁ గలసి పోయెను. ఆహా! కాలగతి యలంఘనీయము గదా!

శ్లో॥ సారమ్యా నగరీ మహాన్ సనృపతిః సామంతచక్రం చ తత్
పార్శ్వే తస్య చ సా విదగ్ధపరిషత్ తాశ్చంద్రబింబాననాః
ఉద్రిక్తః స చ రాజపుత్రనివహస్తే వన్దినస్తాః కథాః
సర్వం యస్యవశాదగాత్ స్మృతిపథం కాలాయ తస్మై నమః॥

భర్తృహరి.

# జ్ఞానోదయ గ్రంథమాల

## మచిలీపట్టణము

---

### ఆంధ్రమహాజనులారా! దేశీయసోదరులారా!

ప్రపంచ మందలి సమస్త విషయముల యెడలను జ్ఞానము నభివృద్ధి నందింపఁజేసిననేగాని యే భాషయుఁ బరిపూర్ణత్వము నంద నేరదు. ఆ భాషాపరిపూర్ణతను నంద యత్నింపని జాతి యెల్లప్పుడు నధోగతి ననుసరించియే యుండును. ఫరాసుదేశముయొక్క నాగరికతయు, జర్మనీదేశముయొక్క యౌన్నత్యమును, జపానుదేశముయొక్క విజృంభణమును, ఇంగ్లాండు దేశముయొక్క దివ్యైశ్వర్యమును, ఆయాదేశములయందలి భాషాప్రవృద్ధివలననే వెలుగొందుచున్నవని మనము తెలిసికొనవలయును. భరతవర్షమునం దైనను బంగాళీభాష యెటుల నభివృద్ధి నందియున్నదో చూడుడు! ఈ బంగాళీభాష, ప్రకృతిశాస్త్రములయందేగాని, చరిత్రలయందేగాని, నవలలయందేగాని, వార్తాపత్రికలయందేగాని, పాశ్చాత్యభాషలకు వెనుదీయని దినదినప్రవర్ధమానస్థితి నందుచున్నయది. ఆంధ్రభాషయు నా స్థితికి రావలయు నన్న మనము విశేషమగు పట్టుదలతోడను నుత్సాహముతోడను బనిసేయవలసి యున్నది. ఆంధ్రులయందు విజ్ఞానమును వెదజల్ల నెంచిన కొన్ని మండలులును, కొన్ని భాషాసంఘములును గలవుగాని, వీరలుమాత్రమే భాషకు వలయు సంపూర్ణసేవను జేయఁగలుగుదు రనుట కలలోనివార్త! అట్టిసంఘములు నూరైనను విడువకుండ లోకయాత్రశతాబ్దము పని చేసినను నాంగ్లేయభాషావాఙ్మయమునందలి శతాంశమునైనను బ్రమరింపఁజాలవు. ఇట్టిసందర్భమున మేమును గ్రంథమాలరూపమున స్వల్పధరల కందుబా

టునం దుండునటుల, నాంధ్రుల కత్యంతోపయోగ మగునట్టియు, దేశబ నుల మాహాత్మ్యమును రంజింపఁ జేయునట్టియు, దేశాభిమానుల ఆదర్శములఁ బుకిగొల్పునట్టియు, భాషాభిమానులభావములఁ బ్రకాశింపఁ జేయునట్టియు, గ్రంథముల వెలువరింపఁ జేయుటమూలమున మాస్వీయంవిధిని నెరవేర్పఁబూనుకొని యున్నారము. ఇందులకై మాకు ఆంధ్రమహాజనులు తోడ్పడి తగు ప్రోత్సాహము నిచ్చుచు దేశోపయోగమగు గ్రంథముల నింకను బ్రకటించుటకు వలయు ధైర్యోత్సాహముల నొసంగుదు రని నమ్ము చున్నారము.

## పద్ధతులు.

సంవత్సరమున కథమపక్షము మూఁడుగ్రంథముల నైనను వెలువరింతుము. శాశ్వతచందాదారులుగ నుండి మేము ప్రకటించు ప్రతిగ్రంథమును బుచ్చుకొన నియ్యకొనినవారలకు క్రవును సైజు ప్రతినూఱుపుటలకు 4అణాలు చొ॥ వెలను నిర్ణయింతుము. మాయొద్ద నిదివఱకే సిద్ధమయియున్న గ్రంథములను గూడ నీక్రింది వివరముల ప్రకారము చందాదారులకుఁ దక్కువ వెలల కిత్తుము.

☞ ఇదివఱలో మాయొద్ద నేదైన గ్రంథమునుగాని, గ్రంథములను గాని, కొనియున్నయెడల నా సంగతి మాకు దెలియఁబఱచినచో వార నామములను మాయొద్ద లిస్టులో సరిచూచి కొదువగ్రంథములను మాత్రమే మా గ్రంథమాలయొక్క చందాపద్ధతులప్రకారము తక్కువధరలకు బంపఁ గలము.

చందాదారులుగఁ జేరుటలో మొదటిమూఁడు గ్రంథములలో నేగ్రంథమునుండి నైనను బ్రారంభింపవచ్చును. అయితే చందాదారులుగ నుండువారు, 1 వ గ్రంథమునుండి ప్రారంభించిన యెడల 1, 2, 3, 4, 5, 6 గ్రంథములను దీసికొని తీరవలయును. 2 వ గ్రంథమునుండి ప్రారంభించిన

మొదల 2, 3, 4, 5, 6, గ్రంథములను దీసికొని తీరవలయును; 3 వ గ్రంథము నుండి ప్రారంభించినమొదల 3, 4, 5, 6, గ్రంథములను దీసికొని తీరవల యును. ప్రవేశకట్నమక్కఱలేదు. పోస్టుఖర్చులను బుక్కుకొనువారే భరింపవలయును.

# 1. ఆంగ్లేయ వైద్యచింతామణి

"వేయేల! ఈరోగ మారోగ మనక మనుష్యసామా న్యమునకు వచ్చురోగములు. అట్టిరోగముల యుత్పత్తులు, వాటిచికిత్సలు నీ యాంధ్రవైద్య గ్రంధరాజ మందు విపులముగ వ్రాయఁబడినవి" (ఆకాశవాణి పత్రిక)

ఇందు సర్వవిధములగు రోగముల గుణములును, క్రిమములును, చికిత్సలును, ఆధునిక వైద్యశాస్త్రము ననుసరించి తెలుపఁబడినవి. ఇందువలన నాంగ్లేయవైద్యశాస్త్రము ఆంధ్రులకు కరతలామలకం బగును. బాలురకును దెలియఁదగు శైలిలో వ్రాయఁబడి యున్నది.

## దీనివలని లాభములు.

స్వలాభము నా పొందవచ్చును! ధనమూ సంపాదింప వచ్చును!! ప్రపంచమునకూ మేలును జేయవచ్చును!! జనాదరణ నా బడయవచ్చును!! ఆంగ్లేయ వైద్యచింతామణిని జదువుట వలన నెన్నిలాభములో చూడుఁడు!

ఆంధ్రమహాజనులారా! మీ గృహమునందుగాని, మీకుటుంబము నందుగాని, మీ పట్టణమునందుగాని, ప్రాణాపదసమయమున జయప్రద

మగు వ్యాధిచికిత్స జేయుటచే మానవసేవఁ జేయుచు, జనాదరణను బడయఁ దలంచితిరని ఆంగ్లేయవైద్యచింతామణిని జదువుఁడు!

ఆంధ్రదేశీయవైద్యులారా! మీ మీ వైద్యాభ్యాసములందు, నూతనాంశముల నెఱుంగుటచే వ్యాధిచికిత్సలయందు సులభమార్గముల నభ్యసించుచు, బహుసూక్ష్మ మగు శాస్త్రీయపద్ధతుల నవలంబించుటచే వ్యాధిని నిర్మూలము జేయుచు, మెప్పు వడసి, మిక్కుటమగు ధన మార్జించుచు, తరతరములకు ఖ్యాతిని సంపాదింపఁదలంచితిరేని, ఆంగ్లేయవైద్యచింతామణిని జదువుఁడు! ఇందలి రహస్యముల గ్రహింపుఁడు!!

ఆంధ్రవిదుషీమణులారా! మీకుటుంబము లందు దేహారోగ్యములను జక్కఁగఁ గాపాడి, వ్యాధులను బారఁద్రోలుటకు శక్తిని సంపాదించి, సౌఖ్యముగ నుండఁదలంచితిరేని ఆంగ్లేయవైద్యచింతామణిని జదువుఁడు!

“మీరు వి. పి. మార్గమునఁ బంపిన ఆంగ్లేయవైద్యచింతామణి నందియుంటి నని తెలియఁజేయుటకు సంతసించుచున్నాను. నాబంధువులయందీగ్రంథము వ్యాప్తతనందఁ జేయ నిచ్ఛగలిగి యుంటినిగాన, మఱియొక ప్రతిని వి. పి. గాఁ బంపఁగోరినాను.” (Sd.) వె. మల్లపరాజు, సబ్ అసిస్టెంట్ సర్జన్, ఆడ్డతీగెల, గోదావరి రేజన్సీ.

## పండితాభిప్రాయములు.

ఆయుర్వేదమార్తాండభిషఙ్మణి పండిత డి. గోపాలాచార్యులవారు:—“...ఇట్టి గ్రంథము సామాన్యవైద్యులకు మిగుల మేలుఁ జేయుచు ప్రతికుటుంబమునను నుండఁదగినదని నొక్కి చెప్పఁగలను.”

డాక్టరు ఆచంట లక్ష్మీపతి బి. ఏ. యం. బి. అండ్ సి. యమ్. గారు:—“ఆంగ్లేయవైద్యసారమును ప్రజలయెదుటఁ బెట్టి

మనదేశపు ప్రజల యంధకారమును బాపు గ్రంథములలో నిది నొకటి యని చెప్పవచ్చును."

డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య బి. ఏ. యం. బి. అండ్ సి. యం. గారు:— "... గ్రంథకర్తగారెంతయు వ్యయప్రయాసములకోర్చి యీ గ్రంథపూర్వకముగ నాంగ్లేయవైద్య శాస్త్రసారము నాంధ్రుల కందఁజేసి వారి కృతజ్ఞతకుఁ బాత్రులయిరి."

డాక్టరు డి. యస్. రామచంద్రరావు యం. ఏ. యం. బి. సి యచ్. బి. గారు:— "...వైద్యేతరులు వ్యాధుల యొక్క సాధారణగతులయందు తమను, దమ కుటుంబములను, జికిత్స చేసికొనుటకై యీగ్రంథ ముపయోగింపఁ గలదు."

చందాదారులకు రు 2-0-0 ఇతరులకు రు 3-8-0

పోస్టుఖర్చులు 5 అణాలు.

---

## 2. శ్రీకృష్ణుని జీవితచారిత్రము

క్రవును 330 పుటలు.

దేశబాంధవ్ లాలా లజపతిరాయ్ చే ఉర్దూభాషయందు వ్రాయఁబడి, శ్రీయుత కోణకంచి చక్రధరరావుగారిచే నాంధ్రీకరింపఁ బడినది.

శ్రీకృష్ణుని యాదర్శ మద్వితీయము!

## శ్రీకృష్ణుని వర్తన మనుకరణీయము!!
## శ్రీకృష్ణుని జీవిత మత్యంతవర్ణనీయము!!!

దేశచరిత్రయందలి యిట్టి మహాపురుషుల జీవితముల బరిశీలనగఁ జది వినఁగాని యేజాతియును నభివృద్ధి నంద నేరదు, 8 చిత్రపటములు గలవు. బహు రసవంతముగ వ్రాయఁబడినది

ఈ గ్రంథమును జదువునప్పుడు మేనఁ బులకలు వొడమునని చెప్పుట అతిశయోక్తి కానేరదు. ఈగ్రంథము ఉర్దూభాషయందు మూఁడుమారులు ముద్రితమై నాల్గవముద్రణమున కిపుడు సిద్ధముగ నున్నది. ఉర్దూభాషయం దింతవఱకు 30,000 ప్రతులైనను కర్చుపడి యుండవచ్చును. ఆంధ్రభాషయం దిదివఱ కిట్టి గ్రంథము వెలువడి యుండ లేదు.

చందాదారులకు రు 0-12-0 ఇతరులకు రు 1-4-0 పోస్టుఖర్చులు 3 అణాలు.

# 3. జపానీయము.

డెమి 100 పుటలు.

## దేశభక్తిపూరిత మయిన దివ్యనాటకము.
## జపానీయుల అద్భుతకృత్యములు బహురసవంతముగ నిందు వ్యక్తీకరింపఁ బడినవి.

ప్రబంధములకంటె నవలలును, నవలలకంటె నాటకములును, సందర్భాంశముల నతిరమ్యముగఁ బ్రదర్శన మిచ్చు ననునది నిర్వివాదాంశమయి యున్నది. ప్రపంచ మంతయు నొకేమారుగ దిగ్భ్రమ జెందునట్లు రుష్యా మహారాజ్యమును సంగరమున నోడించిన జపానువారి యుద్ధచరిత్రమును నాటకరూపమునఁ జదువ నుద్యుక్తుఁడుగ నుండని యే మానవుఁ డుండఁ గలఁడు!

ఇందు జపానీయుల దేశభక్తియు, జపానీయుల రాజభక్తియు, జపానీయుల స్వార్థత్యాగమును, పురుషులయందును స్త్రీలయందు నేగాక, బాలురయందును గూడ వెల్లువలయి పాఱుచుండును!

ఇట్టి నాటకము నాంధ్రము లిదివఱ కెన్నఁడును జదివి యుండలే దని దృఢముగఁ జెప్పగలము.

చందాదారులకు రు0-6-0, ఇతరులకు రు 0-12-0పోస్టుఖర్చులు 2అణాలు

# 4. లుబ్ధమహాజనసభ.

క్రవును 215 పుటలు.

హాస్యరసప్రధానము లైనట్టియు, అర్థిక శాస్త్ర సంబంధమగునట్టియు, వేదాంత శాస్త్రసంబంధమగునట్టియు, సంశయములఁ జక్కఁగ జర్చించినట్టి యుపన్యాసములు; చదివితీరవలయును; బహు వినోదకరములు!

ఈ యుపన్యాసములలో వర్ణింపఁబడినఁ గొందఱు మహాపురుషులు మైలురాళ్లవలె గనబడక మానరుగనుక నట్టివా రెవరైనను దమగుణగణములకు సరిపోవు లుబ్ధుల గుణముల నిందుఁ గనుగొనిన యెడలఁ గాక తాశీన్యాయముగ నెంచి గుమ్మడికాయలదొంగలవలెఁ బ్రవర్తింప కుందురు గాక!

చందాదారులకు రు 0-1-0 ఇతరులకు రు 0-2-0.

# వ్యవసాయశాస్త్రము

(క్రవును 300 పుటలు)

[శ్రీయుత పి. వెంకయ్య యం. ఆర్. యే. యస్. గారిచే

రచియింపఁబడినది.]

ఇందు కాయధాన్యములు, వస్త్రములకు పనికివచ్చు పైర్లు, చమురు గింజలు, పప్పుధాన్యములు, తోటపైర్లు, రంగుల కుపయోగించు పైర్లు, ఎరువులు, పశువ్యాధులు, వానిచికిత్సలు మొదలగువాని గురించి విపులముగా వ్రాయబడినది. కొన్నివిషయములలో యకరమునకు సంవత్సరమునకు రు 1000 లు వఱకును లాభము దీయుటకు మార్గము లిందు సూచింపబడి యున్నవి. వ్యవసాయముతో సంబంధ ముండిన ప్రతియాంధ్రుడును నీగ్రంథమును జదువదగి యున్నది.

(ఆంధ్రకేసరి 1—12—11.)

“వ్యవసాయవిషయమును గుఱించి యింత విపులముగా నున్నగ్రంథ మిదివఱ కెన్నండును నాంధ్రంబునఁ బ్రచురింపఁబడి యుండలేదు.”

చందా దారులకు రు 0-12-0 ఇతరులకు రు 1-2-0 పోస్టేజి రు 0-3 0

## 6. మహాభారతసారము.

చందా దారులకు రు 0-14-0 ఇతరులకు రు 1-5 0 పోస్టేజి రు 0-4 0

## 7. మయూరాసనము. (25 పుటలు)

భారతభూమి యొకానొకప్పుడు వహించియున్న దివ్యతర మగు మహావైభవమును నద్దమునందువలెఁ గన్పింపఁజేయు మయూరాసనము గూర్చిన యీచిన్నివ్యాసమును జదివి తీరవలయును.

చందా దారులకు రు 0-1-6 ఇతరులకు రు 0-2-0

వెలయువారలు:—

మేనేజరు, జ్ఞానోదయ గ్రంథమాల, మచిలీపట్టణము.

లేక

సేతు బ్రదర్సు, మచిలీపట్టణము.

(జ్ఞానోదయ గ్రంథమాల ప్రకటన)

# మహాభారతసారము

[ద్రోణంరాజు సీతారామరాయ విరచితము.]

పంచమవేదమనంబడు మహాభారతమును ప్రతిభారతీయుడును శ్రద్ధా అనుదినమును పఠింపవలసియున్నారు. ఇంతటి సారము స్త్రీలకు పిల్లలకు కూడ తెలియవలసియున్నది. ఈ గ్రంథముల ఔన్నత్యము మన మెరింగి యుండినగాని మనమాహాత్మ్యము మనము గ్రహింపజాలము. అక్షర జ్ఞానము గలిగిన ప్రతి స్త్రీయును ప్రతిపురుషుడును మహాభారతమునందలి కథనంతయును గ్రహించుటకు వీలగునటుల సులభశైలిని సూక్ష్మముగ వ్రాయబడియున్నది. సందర్భానుసారముగ నేగనైన చిత్రపటములు గూడ సమర్పబడి యున్నవి ప్రతిసందర్భమునందున మహాభారతమునందలి రత్నములను బోలు పద్యములు యెత్తి ముద్రింపబడినవి. గ్రంథమంతయు బహు సుమధురశైలిలో వ్రాయబడి యున్నది.

క్రౌను 8 వ సైజు; 350 పుటలు; చిత్రపటములు; దళసరి గ్లేజు కాగితము; క్యాలికో బైండు; వెల రు 1-5-0; పోస్టుఖర్చులు వేరై యున్నవి.

మేనేజరు, జ్ఞానోదయగ్రంథమాల.

లేక

సేతు బ్రదర్సు, మచిలీపట్టణము.